# వదలబోకుము నా చేయి

# వాసుదేవ



నారుమంచి వేంకట అనంతకృష్ణ

# వాసుదేవ శబ్దవిచారము

వ్యాకరణము ప్రకారము 'వసుదేవస్య అపత్యం పుమాన్ వాసుదేవః' అన్నట్లైతే వాసుదేవుడు అంటే వసుదేవుని కుమారుడైన శ్రీకృష్ణుడు అని. ఇది స్వామి నామానికి లీలార్థము.

భాగవత ధ్యానములో

**సచ్చిదానంద రూపాయ విశోత్పత్యాది హేతవే**
**తాపత్రయ వినాశాయ శ్రీకృష్ణాయ వయం నుమః**

అని నమస్కరిస్తాము కదా. అంటే శ్రీకృష్ణుని సచ్చిదానందరూపుడు అన్నది. అంటే పరమాత్మ యుక్క స్వరూపలక్షణము చెప్పినది.

నేనుగా చెప్పబడే చైతన్యము ఉన్నది. అదే **సత్**. సత్ అంటే ఉండుట లేక వసించుట. అదే **వాసు** శబ్దము.
ఉన్నది సరే, అది వ్యాపించియున్నదని తెలుసుకోగలగాలి. వ్యాపించుట తెలుసుకోవటం, అదే **చిత్**. అదే ప్రకాశము, వెలుగు అంటే దీవ్యతి అని. దీవ్యయే **దేవ** శబ్దము.

అంటే అన్నింట వసించి, ప్రకాశించేవాడు వాసుదేవ శబ్దవాచ్యుడు; ఉన్నాడు, ప్రకాశిస్తున్నాడు అని. ఇది స్వామి నామానికి పరమార్థము.

స్వామి అంటే ఆనందమే. **ఆనందం** ఆయన స్వరూపమే.

**స్వామి నామము లీలార్థములో గానీ, పరమార్థములో గానీ, ఎలా ధ్యానించిన ధన్యులమే.**

**వదలబోకుము నా చేయి వాసుదేవ (శతకము)**
నారుమంచి వేంకట అనంత కృష్ణ


ప్రథమ ముద్రణ : క్రోధి, వైశాఖం. June 2024

వెల : అమూల్యము

ప్రతులకు సంప్రదించండి :

**N.V.Anantha Krishna**
Advocate,
Plot No.80, Sri Sai Nagar, Road No.4
Opp.Sri Saibaba Temple, Nagole Post,
Hyderabad 500 068.

Mobile:9246531895
Email: ananthcourt@rediffmail.com

# మంచివారు నారుమంచి వారు

ఛందమెద్ది యైన సుందరపద్యమ్ము
లను రచించి పండితుల ప్రశంస
లందుకొనుచుఁ గృతుల నందించుచుండెడి
మంచివారు నారుమంచి వారు

.సత్కృతుల నొనర్చి సాహితీలోకాన
నెదిగియుండి కూడ యొదిగియుండు
ధీప్రదీప్తులౌ స్థితప్రజ్ఞులగుటచే
మంచివారు నారుమంచి వారు

.స్తుతులు సూక్తులే సతత వస్తువులుగ గ్ర
హించి శతక రచన లెన్నొ చేసి
సంప్రదాయములను సామాజిక మొనర్చు
మంచివారు నారుమంచి వారు.

న్యాయవాద వృత్తి నయమొప్పఁ జేయ వి
రామ మెఱుఁగకుండి రక్తితోడ
సాహితీసభలకు సద్భూషణంబగు
మంచివారు నారుమంచి వారు.

పట్టి విడువవద్దు వాసుదేవా నాదు
కరమటంచు భక్తి గదుర స్నేహ
భావముట్టిపడగ వ్రాసిరి శతకమున్
మంచివారు నారుమంచి వారు.

సమస్యాపృచ్ఛకచక్రవర్తి, పద్యవశంకర‘
**కంది శంకరయ్య**
వరంగల్  08.07.2024

ఓం శ్రీమాత్రే నమః

# అంతులేని భక్తిరసప్రవాహము

శ్రీమన్మంగళ వాగ్విదాంవరులు నా సహోదరులు చిరంజీవి నారుమంచి వేంకట అనంతకృష్ణ కేవలం రెండురోజులలోనే వదలఁబోకుము నా చేయి వాసిదేవ! అనే మకుటంతో అష్టోత్తరశత తేటగీతులలో ఆ వాసుదేవుని ముందు తన హృదయాన్ని ఆవిష్కరించారు. ఈ శతకము భక్తి సుధాస్రవంతికాగా అష్టోత్తరశత కుంభాభిషేకము వాసుదేవునకు చేసి వదలఁబోకుము నాచేయి వాసుదేవ! అని విన్నవించుకొన్నారు. ఇక్కడే మనకు అర్థమవుతోంది, ఇదివరకే తమ అమూల్యమయిన రచనలతో ఆ పరంధాముడు ఈ భక్తకవిని మెచ్చి ఈ కవి చేయి పట్టుకొని ఉన్నాడని. పట్టిన చేయి పొరపాటున పరమాత్మ వదిలెస్తాడేమోనన్న శంకతో ఈ మకుటంతో ఈ శతకం వ్రాసేరు. నిజమైన భక్తుని యొక్క ఆర్తి ఈ విధంగానే ఉంటుందిమరి. ఈశతకం

శ్రీదయానిధి విష్ణు హరీ రమేశ
శ్రీనిధి పరంతపా పాహి దీనపోష
తండ్రి దిక్కంటి స్నేహహస్తమ్ముచాపి
వదలఁబోకుము నాచేయి వాసుదేవ

అనే పద్యంతో ప్రారంభించారు. ఇది ఎంత ఔచిత్యంతో కూడుకొన్నదో పరిశీలిస్తే ఆశ్చర్యం కలుగుతుంది. కృతి భర్తకు, కృతి కర్తకు, పాఠకులకు, సమస్త మంగళములను కలుగఁజేయు మంగళప్రదమయిన శ్రీకారముతో ప్రారంభించుటలో వీరి లోకకల్యాణ కాంక్ష వ్యక్తమౌతోంది, అంతే కాదు. రచనలో వీరి గడుసుతనాన్ని గమనిద్దాం. ఎవరినైనా తనకనుకూలంగా మలచుకోవాలనుకొంటే ప్రియమైన విధమగు పలకరింపుతో మాత్రమే సుసాధ్యమవుతుంది కదా? ఈ విషయం బాగుగానెఱిగిన మన అనంతకృష్ణ ఆ వాసుదేవుని దయానిధి! అని సంబోధించి ప్రారంభించారు. ఆ పరమాత్మ దయకు నిధి అని భక్తుడనుచున్నప్పుడు ఆతని కోరికను నిర్లక్ష్యంగా కొట్టిపడేసేందుకింక అతనికి అవకాశమేముంటుంది? ఈ విధం పరమాత్మనే నిరవకాశం చేసేరు. రమేశ! అన్నారు. ఇక్కడ కూడా వీరి గడుసరితనం స్పష్టమైపోతోంది. ఎవరికైనా భార్య అన్నా, భార్య మాట అన్నా గౌరవం తప్పక ఉంటుంది. కాబట్టి రమాదేవికి భర్త అయిన తానిక ఏ విధంగానూ కవి కోరిక

తీర్చకుండా ఉండే మార్గమే లేకుండా బంధించేశారీ కవి. ఇంతటి నిపుణులు కాబట్టే వాగ్విదాంవరులుగా కీర్తి గడించారు నా సహోదరులు. ఈ పద్యంలో ప్రతీ అక్షరమూ సాభిప్రాయముగా దళసార్ధక్యముతో వ్రాసినదే కాని నిరుపయోగమయినదొక్కటి కూడా లేదు.

ఇక స్థాలీ పులాక న్యాయముగా ఈ శతకమును చూద్దాము. (20) "ఇంటివద్దనె చెప్పక యుంటివేల యేడ్చిన నని(లో చె)లోఁ జెప్పుటదేమి లీల గుక్క పట్టితి నా యేడ్పు గుర్తు పట్టి వదలబోకుము నాచేయి వాసుదేవ" అర్జునునకు గీతాప్రబోధ చేసేదేదో ఇంటిదగ్గరే చేయవచ్చు కదా? విషాదంలో ఉన్నప్పుడు చెప్పేవేమిటి? అని ప్రశ్నించి నేను కూడా గుక్కపట్టి ఏడుస్తున్నాను. అలాంటి నా ఏడుపును కూడా నువ్వు గుర్తించు. పట్టిన నా చేతిని మాత్రం విడువకు అని విన్నవించుటలో ఎంతటి గడుసుదనం చూపించారో గ్రహించవచ్చు. రచన చేసామంటే చతురోక్తులు అలంకారములు మహాకవులకు సహజంగానే రచనలో చోటు చేసుకొంటాయి. ఈ క్రింది పద్యం గమనిస్తే ఈ విషయం స్పష్టమౌతుంది. (23) "దోష సంపద కొండంత తోచుగాక నిన్ను నమ్మిన సమయుగా నిముసమందు మంచు సూర్యుని రాకతో మాయమవదె? వదలబోకుము నాచేయి వాసుదేవ!" ఇందు అర్థాంతన్యాస అలంకారము ప్రయోగించారు. లక్షణ గ్రంథంలో చెప్పిన విధముగానే ఉన్నది పరిశీలిస్తే. ఎలాగో చూద్దాము. నాలో దోషాలు కొండంత కనిపించవచ్చును గాక, ఐతేమాత్రం ఏమౌతుఇంది? నిన్ను మనసారా నమ్మితే క్షణంలో మటుమాయమైపోతాయి. ఎంతమంచు క్రమ్మి ఉన్నా సూర్యుఁడు రాగానే మాయమవకుండా ఉండదు అనే నిత్యసత్యాన్ని ప్రమాణంతో అర్థాంతరన్యాసాలంకారమును ప్రయోగించుట కవి రచనా వైదుష్యమును చాటుచున్నది.ఈ విధముగా చెప్పుకొనినచో ప్రతీ పద్యమును గూర్చి చెప్పుకొనవచ్చును. పాఠకుడు స్వయముగా ఆద్యంతము పఠించుసమయమున ఎవరి భక్తిసాంద్రతను బట్టి వారికి ఈ శతకము వ్యక్తమవక మానదు. మా తమ్ముని నిష్కళంక హృదయమునుండి పొంగే గంగాప్రవాహమే ఈ భక్తిరచనలు. ఇటువంటివి ఇంకనూ పెక్కురచనలు ప్రభవించుట ద్వారా సాహిత్యాభిమానులకు భక్తులకు ఆనందప్రదములు కావలెనని ఆశిస్తూ ఆ అమ్మ అనుగ్రహం నిరంతరముగా వీరిపై ఉండి నాకోరిక తీరాలని ఆశిస్తున్నాను. శ్రీమాత్రే నమః.

చిత్రకవితా సమ్రాట్
**చింతా రామకృష్ణారావు.**
తే.28 - 5 - 2024.

# కృత్యంజలి

అద్వైత సిద్ధాంతాన్ని లోకానికి అందించిన ఆదిశంకర భగవత్పాదాచార్యులవారు సంసార పంక నిర్మగ్నమైన లోకం నుంచి తనను ఉద్ధరించమనికోరుతూ శ్రీ లక్ష్మీనరసింహస్వామికి "మమదేహి కరావలంబం" అని మొరపెట్టుకున్నారు. "నాకు నీచెయ్యి అందించి ఆదుకోవయ్యా!" అనివేడుకొన్న శంకరులకు అసలుసంసారమే లేదు, వారు ఆపంకంలో కూరుకొని పోనూలేదు. కాకపోతే వారు కవిగా, ద్రష్టగా మనందరికోసం, లోకాన్ని ఉద్ధరించడానికి లక్ష్మీ నరసింహ స్వామివారిని ఎలా ప్రార్థించాలో తెలియజెప్పారు.

అలాగే అద్వైత వేదాంత తత్త్వాన్ని ఒంట పట్టించుకున్నవారు, లలిత ఉపాసకులుగా లలిత పదములతో లలిత మాత పదాలను కొలిచినవారైన శ్రీనారుమంచి వేంకట అనంత కృష్ణ గారు అలతి అలతి పదాలతో "వదలకు నా చేయి వాసుదేవ" అని వాసుదేవుని ప్రార్థించడం ఈ శతకం ప్రత్యేకత.అన్నీ తెలిసిన వారు అలతి అలతి పదాలతో పులకరించేలా పలకరిస్తారు అన్నీ మాకే తెలుసనుకున్న వారు తామే ప్రవచనకారులై గొప్ప గొప్ప సందేశాలిస్తుంటారు. లోకంలో ఇదో తమాషా.వదలబోకుము నాచేయి వాసుదేవ!గొప్ప మకుటం. గతంలో మరుకూకు శ్రీ పాండురంగ ఆశ్రమం( సిద్దిపేట జిల్లా)లోని మహాత్మ అప్పాల విశ్వనాథ శర్మ గారు రచించిన "పరుగు పరుగున రావయ్య పాండురంగ!" అనే శతకం ఇలాంటిదే.

గొప్ప తాత్వికతను అంతర్గర్భితం చేసుకుని, నవవిధ భక్తులను అక్షరాలా అలవోకగా వెదజల్లుతూ, కృష్ణ లీలలను హాయిగా ప్రకటిస్తూ సులభ శైలిలో అందించిన ఈశతకాన్ని ఉత్తమ కోవకు చెందిన శతకాల్లో ఒకటిగా చెప్పవచ్చు.ఈశతకంలోని మెచ్చుతునకల్లో మచ్చుకు కొన్ని..ఎంత గడుసుగా తనగుండెలో దేవుడినికొలువుండమంటున్నాడో చూడండి .'పదుగురుల దృష్టి పడునని భయము లేక దృష్టి తగలకనుండెడి తీరు గలదు పరులు చొరనట్టి నా గుండె నుండుమయ్య'.. అంటాడు.మరోచోట మురళికన్నా నేనేమిన్న అంటూ నాకే రంధ్రాలెక్కువ ,ఈకారణంచాలదా నన్ను చేపట్టడానికి అంటాడు.

ఎంతైనా ఈ కవి హైకోర్టు అడ్వొకేట్ కదా!కర్మ సన్యాస యోగాన్ని, ఆత్మవత్ సర్వభూతాని వంటి జ్ఞానాన్ని, మనోబుధ్యహంకారాలు అష్టతత్త్వాలనీ, భగవద్గీతార్థాలను ఎంతో అందంగా పద్యాల్లో పొదిగి'నేను నేనన్న నేనది నేను గాక నీవు నీవన్న తత్వము నీవే నిలుపు' మంటూ అద్వైత తత్వాన్ని ఆవిష్కరిస్తాడు.ఉపనిషద్వావాక్యాన్ని స్ఫురింపజేసే"దేహరథమున సారథి దేహివీవే"'ఘటసమస్తమౌ నేకమాకాశమట్లు'వంటిపాదాలు ఈశతకంలో కొల్లలు

ఇక, 'తల్లి తల్లడిల్లిన వేళ తత్వ బోధ', 'చేయు చేతలు నీదైన చేతనాది చేత మెచ్చితినిటు పైన చేత నాదె''నన్ను నన్నుగా చేకొమ్ము నమ్మియుంటి','గతము భావియులేనట్టు గతిని పొంద', 'అవ్యయానందమూర్తివౌ అంతరాత్మ'వంటి అనుప్రాసాలంకారాలతో ఆత్మతత్వాన్ని ఉపాయంగా అందించారిందులో. స్వామీ! నేను నీ సొత్తును. కనుక కాచి పెంచి పోషించి దాచే బాధ్యత నీదే అని కొండొకచో దబాయిస్తాడు. మరోచోట ఇంట్లో చెప్పవు ఏడిస్తే యుద్ధరంగాలో చెప్తావా! ఇదేం పద్ధతయ్యా? అనినిలదీస్తాడు.బాల్య మిత్రుడి కోసం వీధి గుమ్మం దాకా వెళ్లి ఆహ్వానించావు అట్లా నాకోసం కూడా రాలేవా ? అని ఆక్షేపిస్తాడు.

స్వామి వారి పేర్లను, లీలలను ప్రస్తావిస్తూనే వెలసిన క్షేత్రాల మమాహాత్మ్యాలను వెల్లడిస్తాడు.ఇలాచూస్తూపోతే అన్నీ విశేషాలే.అన్నీ నేనే చెప్తే ఎలా..మీరూ చదివి ఆస్వాదించాలిగా!'కామ రాజ బీజాదిగా కలసి కృష్ణ సమాన యుక్తమౌ మంత్రాత్మ శక్తి రక్ష'గా ఉన్న వాగ్విదాంవరులు అనంతకృష్ణగారి'నాదులోపలి నాదమై' వెలసిన ఈ కృతికి కృత్యంజలి. స్వస్తి.

'సాహితీ ప్రభాస'
**మరుమాముల దత్తాత్రేయ శర్మ**
విశ్రాంత ప్రధానాచార్యులు
తెలంగాణ రాష్ట్ర గురుకుల విద్యాలయాల సంస్థ.

తేది: 28.06.2024

"సాహితీబంధు, ఛందశ్శాస్త్రరత్నాకర,
ఛందోబ్రహ్మ, ఛందస్సమ్రాట్"

**తోపెల్ల బాల సుబ్రహ్మణ్య శర్మ,**

" అనంతచ్ఛందస్సౌరభ" గ్రంథ సంకలనకర్త.

*"నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి తన్నో విష్ణుఃప్రచోదయాత్"*

అన్నమాట ప్రకారం " వదలబోకుము నాచేయి వాసుదేవ " నేను జీవుడను నీవు దేవుడవు నీ చేతిలో నా చేయి ఉంచాను స్వామీ ఎట్టి స్థితిలోను నా చేయి విడువవలదని "అన్యథా శరణమ్ నాస్తి త్వమేవ శరణమ్ మమ" తనయొక్క స్థిరచిత్తాన్ని తెల్పుచూ అనేక నిగూఢ తత్త్వాలను వేదాంతాన్ని పురాణ వేద వేదాంగ విషయములను అంతర్లీనంగా ఉంచుచూ పైకి సాధారణంగా కనిపించేలా ఇదొక "అనంత కృష్ణ మాయ" గా అద్భుతంగా రచించిన శ్రీమత్కౌశికగోత్రోద్భవులు వాగ్విదాంవర బ్రహ్మశ్రీ నారుమంచి అనంతకృష్ణ శర్మ గారు ఎంతో ప్రశంసనీయులు.

శతక ప్రారంభమే "శ్రీ దయానిధి" అనే శబ్దం అపారకరుణాసముద్రుడు కనుకనే తనచేయి ఎప్పుడూ ఆ వాసుదేవుడు విడువడు అనే నమ్మకాన్ని తెలియజేస్తున్నది. "తండ్రి దిక్కంటి స్నేహహస్తమ్ము చాపి" దిక్కు శబ్దముచే ఉభయార్థముగా కవి ప్రయోగించారు. ఒకటి రక్షణ అయితే రెండవది వాసుదేవుడే భవబంధాలమయమైన ఈ మానవ జీవనంలో పరమాత్మను చేరుకునే మార్గదర్శనము చేయించువాడు అని.

రెండవ పద్యంలో భగవంతునికి అందరూ సమానులే తరతమ భేదములులేవు అన్నట్లు రాక్షసులను కూడా కాచినవాడవు అంటారు కవి. నాల్గవ పద్యంలో పాండురంగవిభుని తత్త్వాన్ని ఒక చిన్ని ఇటుకపై కాళ్ళు అటూ ఇటూ కదపకుండా స్థిరంగా నిలచుటను భగవంతుని కరుణ ఎప్పుడూ తొణకక బెణకక స్థిరముగానే ఉండునని తెలిజేస్తున్నది.

ఏడవ పద్యంలో పరమాత్మ అంతటా నిండి ఉన్నాడన్నది సత్యమే అయినప్పటికి అజ్ఞానాంధకారం లో పడి గుర్తించలేకపోవుట నీ మాయ కదా! కనుక ఆ చీకటిని పారద్రో వెల్గులు ప్రసాదింపవయ్యా ఈ క్రమంలో నా చేయిమాత్రం వదలబోకుమా అంటారు కవి. ఇలా చెప్పుకుంటూ పోతే ప్రతి పద్యము ఒక అనర్ఘ రత్నమే లోతుగా పరిశీలించినచో.

చివరిగా 40 వ పద్యం

చిన్న నాటినుండి తిరగి చేయిపట్టి
తత్త్వ బోధను చేయవు దక్షుడైన
శరణు జొచ్చిన బోధించు గురువువందు
వదలబోకుమ్మ నా చేయి వాసుదేవ 40

ఎంత చిన్నతనం నుండి కలసిమెలసి ఆటపాటలతో జీవనం సాగించినా సమర్థుడైన లేదా దక్షత కలిగినవాడు తత్త్వబోధ అంటే విజ్ఞానాన్ని తెల్పడు ఆ ప్రేమ వాత్సల్యాలెన్ని ఉన్నా. ఎపుడు బోధిస్తాడంటే సమస్తాన్ని విడచి నీవే దిక్కు అని శరణు జొచ్చినపుదు. పోతన కరిచే " నీవేతప్ప నితఃపరంబెరుగ మన్నింపన్ దగున్ దీనునిన్ రావే ఈశ్వర కావవే వరద సంరక్షించు భద్రాత్మకా!" అంటాడు. మన పెద్దలు కూడా చెబుతూ ఉంటారు నిన్ను కోరనిదే ఎవరికీ సలహాలు సూచనలు ఇవ్వవద్దని. ఎంతో ప్రేమించే భార్యా బిడ్డలు సన్నిహితులకు కూడా. వారు నీ పై విశ్వాసము తో అడిగినపుడే చెప్పమని బోధింపమని. శ్రీకృష్ణార్జునుల పరంగా ఈ తత్త్వాన్నే కవి అంతర్లీనంగా చెప్పారు.

ఇదే తత్త్వాన్ని 20 వ పద్యంలో నీ బోధ ఏదో ఇంటివద్దనే చెప్పక భయంకరమైన యుద్ధరంగంలో నే భోరు భోరున ఏడ్చినపుడే బోధ చేసావు అంటారు కవి కృష్ణార్జున పరంగా. ప్రతిపద్యము ఎంతో విలువైనది. స్థాలీపులాక న్యాయంగా మూడు నాల్గు మాత్రమే స్పృశించి నాకు కల్గిన భావాలను మీతో పంచుకున్నాను. శతకాన్ని ఎలాగూ పఠింపబోవుచున్నారు కనుక దాని రసాస్వాదన తప్పక మీరు పొందెదరని నా ప్రగాఢ విశ్వాసము.
ఆ వాసుదేవుడు నా చేయి పట్టుకున్నాడు కాబోలు నాకేసమర్థత లేకున్నా మిత్ర వాత్సల్యంతో శ్రీ నారుమంచి వారీ శతకానికి నాల్గు మాటలందిచమనుట నా పూర్వజన్మ సుకృతముగా భావించుచు

నారుమంచి యనంతకృష్ణ రచితంబు
వదలబోకుము నాచేయి వాసు దేవ
వసుధ యందున తిరముగ వర్థిలంగ
సతము బ్రోచుత ఘనవాణి శారదాంబ!

మాధవపట్నం,
8.7.2024

బుధజన విధేయుడు
**తోపెల్ల బాలసుబ్రహ్మణ్య శర్మ**

# మనసు గుసగుసలు

అమ్మ దయతో పంచాయతన దేవతా స్తుత్యాత్మకముగా శతకములు లోగడ వ్రాస్తున్న పరంపరలో 'భాస్కరాదిత్య ఘృణిసంజ్ఞ భక్తవరద, దివసకర వరేణ్య సవితా తిగ్మకిరణ' అన్న మకుటముతో సూర్యశతకము వెలయించిన రోజులవి. గ్రంథానికి పేరుగా మకుటమే వ్రాయాలంటే చాలా పెద్దదైపోతుంది. భాస్కరశతకం ప్రసిద్ధమైనది ఇతఃపూర్వమే ఉన్నది. సూర్యశతకము అందామంటే మయూరుని ప్రసిద్ధ శతకమున్నది. అప్పుడు అన్నగారు శ్రీ చింతా రామకృష్ణారావుగారి సూచన మేరకు 'అనంతభాస్కర శతకము' అని నాపేరు ముందు తగిలించుకున్నాను.

అన్నట్లు నా కారు డ్రైవరు పేరు భాస్కర్. నాకొక ఆత్మీయమైన మిత్రుడున్నారు శ్రీ రావుల వాసుదేవరెడ్డిగారని. మంచి హాస్యప్రియులు. ఆయన 'ఏం సారు మీ డ్రైవర్ పేరు నీపేరు కలిపి శతకం వ్రాసుకున్నావు, నేనేం పాపం చేసా' అన్నారు సరదాగా. సర్లే దొరా నా స్నేహాన్ని వదలకు నీ పేరు మీద 'వదలబోకుము నా చేయి వాసుదేవ' అని వ్రాస్తాలే అని అనుకోకుండా అన్నాను. ఇది జరిగి కనీసం పదకొండు సంవత్సరాలైయ్యింది. ఈ మధ్య మళ్ళీ శతకము వ్రాయమని మిత్రులంటే మొదలుపెడదామని కూర్చుంటే ఇదిగో 'వదలబోకుము నా చేయి వాసుదేవ' స్ఫురణకు వచ్చింది. ఒక రెండు మూడు రోజుల వ్యవధిలో పూర్తి చేసుకుని ఇలా మీ చేతుల్లోకి చేరింది. కృష్ణతత్త్వ చింతన చేయిస్తూ, మిత్రునికి ఒక దశాబ్దానికి ముందు ఇచ్చిన వాగ్దానం నిలబెట్టిన అమ్మకు నమస్సులు. అమ్మదయ తప్ప అనంతునకస్తిత్వమేది? అంతా అమ్మదయ మాత్రమే.

స్వస్తి

హైదరాబాదు — గురుపాదధూళి

31.05.2024 — **నారుమంచి వేంకట అనంతకృష్ణ**

# వదలబోకుము నా చేయి వాసుదేవ



శ్రీదయానిధి విష్ణు హరీ రమేశ
శ్రీనిధి పరంతపా పాహి  దీనపోష
తండ్రి దిక్కంటి స్నేహహస్తమ్ముచాపి
వదలబోకుము నాచేయి వాసుదేవ 1

తల్లి దేవకి, సఖుడు సుధాముడంచు
బావ, గురువును, ప్రియురాలు వారలనుచు
కడకు రక్కసులన్ కూడ కాచు ఘనుడ
వదలబోకుము నాచేయి వాసుదేవ 2

గుండెనిండుగ నమ్మిన గుర్తెరింగి
నీదు భారమ్ము బాధ్యత నాదటన్న
బాస చేసిమరుచుటెట్లు పాడియౌను
వదలబోకుము నాచేయి వాసుదేవ 3

ఇటునటు కదలకుంటివి యిటుకపైన
నడుముపై చేతులను జేర్చి నళిననాభ
కరుణకాకారమైనట్టి పరమపురుష
వదలబోకుము నాచేయి వాసుదేవ 4

వేల నామములుండగ వేదవేద్య
యేల దామోదరాయన్న చాల ప్రీతి
చుట్టరికమున్న వదలని దిట్టవీవు
వదలబోకుము నాచేయి వాసుదేవ 5

నారుమంచి వేంకట అనంతకృష్ణ



నిన్ను ప్రేమించుటొక్కటే మిన్ననయ్య
నిన్నెనమ్మియుంటిని విభో నన్ను నమ్ము
మనసు నిండుగ నిండిన మాధవుడవు
వదలబోకుము నాచేయి వాసుదేవ 6

సర్వ భూతమ్ములందున సాధుచరిత
ఆవరించియుందువట మాయావిబోలి
ప్రకటమై వెల్గు నింపుచున్ పరమపురుష
వదలబోకుము నాచేయి వాసుదేవ 7

వచ్చినది బాల్యమిత్రుడు పదపదమని
యెదురు పోతివి కదటయ్య యెఱుకలేదె
నన్నునట్లనుకొనుమయ్య నళిననేత్ర
వదలబోకుము నాచేయి వాసుదేవ 8

వాడు వీడని చూడవు వావి వరుస
ఆదుకొనగరాక్షసుడైన నడ్డుకాదు
నమ్మి నెమ్మది నెమ్మదినిమ్మనంటి
వదలబోకుము నాచేయి వాసుదేవ 9

పల్లెనున్నట్టి వేవేల పడతులంత
తమకడనె యున్నటుల మది తలచుభంగి
నన్ని రూపులు దాల్చిన యందగాడ
వదలబోకుము నాచేయి వాసుదేవ 10



వెతలు పై బడి కుందెడి వేళలందు
వెనుక నేనుంటి మీకేల వెరపటంచు
ధర్మ జయమును కాంక్షించు దైవరాయ
వదలబోకుము నాచేయి వాసుదేవ 11

అన్ని నీవౌచు నీనుండెయవతరించె
సర్వసుఖముల నిచ్చు నీ చరణయుగళి
ఏమి తెలియనట్లుగనుందువేటికయ్య
వదలబోకుము నాచేయి వాసుదేవ 12

నేను చూచుట ఘనమటో నిగమవేద్య
నీవు చూచుటె ముఖ్యమ్ము నీరజాక్ష
కల్గు లోచూపు హృదయాన కాంచునటుల
వదలబోకుము నాచేయి వాసుదేవ 13

నిఖిల జగముల నడువంగ నియతి తోడ
సకలమీవౌచు నీయందె సంభ్రమింప
నేమి యెఋుగనట్లుండు నీదెంత నటన
వదలబోకుము నాచేయి వాసుదేవ 14

మంచి చెడుగుల వైనమ్ముఁనెంచలేను
జపతపాది సాధనల నే సలుపలేక
హృదయమర్పించినాడను హే సురేశ
వదలబోకుము నాచేయి వాసుదేవ 15



లేదు శాస్త్రసామర్ధ్యమ్ము లేదు భాష
లేదు లౌకికజ్ఞానము లేదు విద్య
లేదు సాధనసంపత్తి లేకయున్న
వదలబోకుము నాచేయి వాసుదేవ 16

మునులు రామావతారాన మొరలువెట్ట
రండు గోపికలౌచు చేరంగనంచు
వారి కాచి నన్ విడుచుట పాడికాదు
వదలబోకుము నాచేయి వాసుదేవ 17

వ్రేలు వంచక వ్రేపల్లె వెతల బాపి
ఊరి గో గోపులట్లుగానునికి చూపి
యార్తి బాపిన నా స్వామి యాదుకొమ్ము
వదలబోకుము నాచేయి వాసుదేవ 18

అమ్మ తిట్టినదటనుచు నలుక నటన
భామ తనవాడనుకొనెడి ప్రేమ నటన
నాకు కన్పించు జగము నీ నటనెయైన
వదలబోకుము నాచేయి వాసుదేవ 19

ఇంటివద్దనె చెప్పకయుంటివేల
యేడ్చిన ననిలో చెప్పుట దేమి లీల
గుక్క పట్టితి నా యేడ్పు గుర్తు పట్టి
వదలబోకుము నాచేయి వాసుదేవ 20



తిరుగలిని నలిగినటుల తికమకయగు
నడుమనుండు గాడికడను పడిన చాలు
శుభద నీచరణాలట్లు  సుఖముగలుగ
వదలబోకుము నాచేయి వాసుదేవ 21

కన్న బిడ్డలు తమదారి కనగ వెడల
వారి వారింప జాల నావారు వారు
చెంత నీవుండి యొంటరి చేయకుండ
వదలబోకుము నాచేయి వాసుదేవ 22

దోష సంపద కొండంత తోచుగాక
నిన్ను నమ్మిన సమయుగా నిముసమందు
మంచు సూర్యుని రాకతో మాయమవదె
వదలబోకుము నాచేయి వాసుదేవ 23

వంద పనుల చేయుమటంచు పలుకబోను
బరువులిచ్చి మోయమటంచు  పలుకబోను
వంద వరములనిమ్మంచు పలుకబోను
వదలబోకుము నాచేయి వాసుదేవ 24

ఉన్నదొక్కటె చిత్తమ్ము నుంచినాడ
నీదు పాదాల చెంతనె నిశ్చలముగ
పట్టుకొంటిని నీ చేయి పరమపురుష
వదలబోకుము నా చేయి వాసుదేవ 25



గోపికను కాను వత్సమ్ము గోవు కాను
కలిసి చదివెడి తిరిగెడి కలిమి లేదు
గోడునేరీతి వినిపింతు కూడి నిన్ను
వదలబోకుము నా చేయి వాసుదేవ 26

సర్వ కారణకారణా సత్వ్యరూప
నామరూపాల కావలి స్వామి నీవు
నిన్ను గుర్తించ లేనయ్య నీవె దయను
వదలబోకుము నా చేయి వాసుదేవ 27

పేరు లేనట్టి నిన్నెట్లు పిలువగలను
రూపు లేనట్టి నిన్నెట్లు కొలువగలను
నాదు లోపలి నాదమా వాదమిడక
వదలబోకుము నా చేయి వాసుదేవ 28

ఎత్తు పల్లంపు బ్రతుకులే యెంచి చూడ
కర్మ సంచిత భాగాన కాస్తముక్క
ననుభవించంగ హేతువై తనువు డస్సె
వదలబోకుము నా చేయి వాసుదేవ 29

కొలతకందవు చిత్రమ్ము  కాలరూప
తీరునొక రూపు లేనట్టి దివ్యవేష
నిత్యకారుణ్య భక్తాప్త నీవె దిక్కు
వదలబోకుము నా చేయి వాసుదేవ 30



నాల్గు చేతుల ప్రకటమై నతులనంది
తల్లిదండ్రుల గతగాథ వెల్లడించి
మరల మానవాకృతినొందు మాయగాడ
వదలబోకుము నా చేయి వాసుదేవ 31

ఏమి గో గోపులీవైతివేమిటయ్య
శంక యించుక రాకుండ జనులకపుడు
కావ వేడుగా నడ్డమ్ము కాన తగదు
వదలబోకుము నా చేయి వాసుదేవ 32

స్వామి నీ సొత్తు నేనయ్య సౌమ్యహృదయ
కాచి పెంచి పోషించుట దాచుకొనుట
అంతయున్ నీదు బాధ్యత చెంతనుండి
వదలబోకుమునా చేయి వాసుదేవ 33

తల్లి తల్లడిల్లిన వేళ తత్త్వబోధ
చేసి బ్రోచిన ఘనుడవు దాసపోష
నాకు నర్హతగూర్చుచు నన్ను కూడ
వదలబోకుము నా చేయి వాసుదేవ 34

మురళికన్న మిన్నను నేను తరచి చూడ
రంధ్రములు మెండు శూన్యమౌ రమ్యరూపు
కారణమ్మిది చాలును కరముగొనగ
వదలబోకుము నా చేయి వాసుదేవ 35



వెతికిన దొరకవెవరికి వెతయె తప్ప
గతిగని పరుగుపరుగున వెత విడుగతి
నుతి సలిపిన నను గనవె స్తుతవిభవ
వదలబోకుము నా చేయి వాసుదేవ 36

సాధకుడగాను శాస్త్రాల చదువలేదు
సాధనయు లేదు యోగాది చర్యలేదు
సిద్ధుడవు నీవె యనియెడి స్పృహయులేదు
వదలబోకుము నా చేయి వాసుదేవ 37

పాల సంస్కరించక వెన్న బయట పడదు
జీవు సంస్కరించక యున్న నీవు రావు
జడమతిని నేను నీపాల పడితినయ్య
వదలబోకుము నా చేయి వాసుదేవ 38

భూతకాలచేష్టలు పెనుభూతమయ్యె
భవ్యమందున మెండాయె బద్ధకమ్ము
భావి యించుక తోచగ భవ్యచరిత
వదలబోకుము నా చేయి వాసుదేవ 39

చిన్ననాటినుండి తిరిగి చేయిపట్టి
తత్త్వబోధను చేయవు దక్షుడైన
శరణుజొచ్చిన బోధించు గురువువందు
వదలబోకుము నా చేయి వాసుదేవ 40



సర్వ మీవెయ్యై నిండిన సత్స్వరూప
చిరునగవు మాయలో దాగు చిత్స్వరూప
అవ్యయానంద మూర్తియౌ అంతరాత్మ
వదలబోకుము నా చేయి వాసుదేవ 41

చేతలన్నియు నే చేతు చేవ నీది
ఫలము కూడను నీదైన భయము తొలగు
కర్మ సన్యాసమందున్న ఘనత తెలిపి
వదలబోకుము నా చేయి వాసుదేవ 42

కష్టసుఖములు రెండును కరిగి పోవు
నోర్మి కలిగియు నిలుచుట ధర్మమనుచు
బోధ చాలదు తోడౌచు పూర్ణతేజ
వదలబోకుము నా చేయి వాసుదేవ 43

నేను నేనన్న నేనది నేను కాక
నీవు నీవన్న తత్త్వమ్ము నీవె నేర్పి
యిట్టి భావమ్ము నాలోన గట్టిపడగ
వదలబోకుము నా చేయి వాసుదేవ 44

నమ్మి యీక్షణమందున వమ్మగుచును
బ్రహ్మ భావమ్ము పెంపొంది రాలిపోవు
స్థిరత సత్యమ్ము సత్త్వమౌ స్థితిని పొంద
వదలబోకుము నా చేయి వాసుదేవ 45



బుద్ధ్యహంకార మనసులు భూత తతియు
అష్టతత్త్వమ్ములెన్నగా నష్టసతులు
నిజము నాలోని చేతన నీవె యౌచు
వదలబోకుము నా చేయి వాసుదేవ 46

సతము నీ నామ మంత్రమే జపము కాగ
మురిసి గోకులమంతయు ముక్తులైరి
డోలలూగక మనసు నీ మ్రోల నిలుప
వదలబోకుము నా చేయి వాసుదేవ 47

కామరాజ బీజాదిగ కలసి కృష్ణ
నమనయుక్తమౌ మంత్రాత్మ నాల్పశక్తి
నాకు రక్షయై నిలువరా నీకు నతులు
వదలబోకుము నా చేయి వాసుదేవ 48

ఈ యనంతమౌ విశ్వమ్మునీవెయన్న
నేనభిన్నునా భిన్నునా నీదు ఛాయ
నౌదునా తెలియగ జేసి హాయి గూర్ప
వదలబోకుము నా చేయి వాసుదేవ 49

వదలదే కామ మోహాది పంకమసలు
వదల సంసార బంధాల బరువు తృటిని
వదలబోను నీ పాదముల్ వదలలేను
వదలబోకుము నా చేయి వాసుదేవ 50



వంకర తిరిగి దేహము వంగినట్టి
కుబ్జ కడకేగి ప్రోతువే అబ్జనాభ
నేను దూరమందుంటినా నీకు రాగ
వదలబోకుము నా చేయి వాసుదేవ 51

లేనిదున్నట్లు చూపించు లేని మనసు
మనసు లయమైన లయమౌను మహియుకూడ
మిథ్య మోసము బాపగ మిమ్ము తలతు
వదలబోకుము నా చేయి వాసుదేవ 52

దేహ రథమున సారథి దేహివీవె
ఇంద్రియాశ్వాల నీవదిలించి పూన్చి
సద్గతినిడగా సరగున మద్గతిమార్చి
వదలబోకుము నా చేయి వాసుదేవ 53

ఈషణమ్ము లుడుగవాయె నేమి సేతు
కానవచ్చిన వన్నియు కావలె నను
మనసు గొనిపొమ్ము మన్నించి మా ధవుండ
వదలబోకుము నా చేయి వాసుదేవ 54

పాదమంట గంగయగును పాదజలము
పాదమంట పాపహరమై పడతి యగును
పాదమంటితి కాపాడ భావ్యమయ్య
వదలబోకుము నా చేయి వాసుదేవ 55



జన్మలిత్తువు చేతల సరణి చూసి
చేయు చేతలు నీదైన చేత గాదె
చేతమిచ్చితి నిటుపైన చేత నీదె
వదలబోకుము నా చేయి వాసుదేవ 56

పదిలమే కర్మ ఫలమును వదలకున్న
అనుభవమునకు రాకున్న నాత్మవిద్య
అర్థమేదియో నాకది అరయుటకును
వదలబోకుము నా చేయి వాసుదేవ 57

సడలనట్టి సర్వవ్యాపకుడవు కాని
చూడకుంటినజ్ఞానినై చూపు లేక
నేను కానలేకున్నను నీవు మటుకు
వదలబోకుము నా చేయి వాసుదేవ 58

క్షణము చిత్తమ్ము మాయను క్షణములోన
మాయకున్న దజ్ఞానమ్ము మా యహమ్ము
భవము తొలగించ నీకు సంభవము తండ్రి
వదలబోకుము నా చేయి వాసుదేవ 59

గుడుల వెతికితి దొరకిన గురుతులేదు
జగతి నీవన్న తెలియని జడుడనైతి
దృష్టి లోనికి చేసి నీ తెరవు తెలుప
వదలబోకుము నా చేయి వాసుదేవ 60



పరమ తాత్పర్యమౌ నీదు  పాదయుగము
సతము హృత్పీఠినుంచెడి వ్రతము బూని
గతము భావియు లేనట్టి గతిని పొంద
వదలబోకుము నా చేయి వాసుదేవ 61

లోకమెఱుగదు నాలోని లోపములను
పారద్రోల నశక్తుడ నేరలేను
సర్వశక్తుడ వీవంచు శరణమయ్య
వదలబోకుము నా చేయి వాసుదేవ 62

పూత కానిదాని పరమ పూత జేసి
పాలు త్రాగెడు మిషను పాపాల బీల్చి
ముక్తినిచ్చిన ఘనమైన మూర్తివంటి
వదలబోకుము నా చేయి వాసుదేవ 63

గోపునట్లుగ వేషమ్ము గొనుచు వచ్చి
గుంపులో చేరు రక్కసు చంపినావు
మారువేషాలు నీవద్ద మనునటయ్య
వదలబోకుము నా చేయి వాసుదేవ 64

వ్రేలునాన్చినట్టి క్షణమున వేగలేక
కొండచిలువ దేహమ్మును కోలుపోయె
ఆయుధమ్ములేటికి నీకు ఆర్తిదీర్ప?
వదలబోకుము నా చేయి వాసుదేవ 65



అల్లరట్లుగ తోచెడి ఆటపాట
లంతరార్థముల్ బ్రోచుట ఆర్తజనుల
రోట గట్టిన లీలను రూఢి సేయ
వదలబోకుము నా చేయి వాసుదేవ 66

అచ్యుతుడవన్న సార్థకమందునయ్య
విడిచి పెట్టవు దరిజేరి యొడిసిపట్టి
అట్టి ధన్యత నీవునాకందజేయ
వదలబోకుము నా చేయి వాసుదేవ 67

తీవ్ర కాఠిన్యమును జూపు తీక్ష్ణ దృష్టి
సాంద్ర కారుణ్యమును జూపు శాంత దృష్టి
రెండిట ఘనుడ నాకిచ్చి రెండవదియె
వదలబోకుము నా చేయి వాసుదేవ 68

నిన్ను సేవించు భక్తుల నీడకైన
కొందలము గూర్చు దుష్టుల క్రూరబుద్ధి
నణచు నా స్వామివీవంచు నడుగుచుంటి
వదలబోకుము నా చేయి వాసుదేవ 69

బ్రహ్మదేవుని సైతమ్ము భ్రమలనుంచి
నిను పరీక్షించ బూనగ పనిచినావు
అర్భకుడను నేనెంత నీ యర్చకుడను
వదలబోకుము నా చేయి వాసుదేవ 70



నింద రానీక రోహిణి నిజము దాచి
భర్త దూరమున్న కనెను బాలునెట్లు
నీదు లీలల నమ్మితి నిన్ను జేరి
వదలబోకుము నా చేయి వాసుదేవ 71

చేత యేదేని కానిమ్ము చేయ నీవు
ధర్మరక్షణమందు తాత్పర్యమగును
ధర్మసారావతారుండ దయను చూపి
వదలబోకుము నా చేయి వాసుదేవ 72

భక్తునవమాన మాపుచు భయము తీర్ప
నీవె తిరిగి దర్శనమిడి నిలిచినావు
ఉడుపి క్షేత్ర గవాక్షమై యుండె సాక్షి
వదలబోకుము నా చేయి వాసుదేవ 73

అన్న చెల్లెళ్ళపై నీదు నాదరమ్ము
పూరి సాక్ష్యమై వెలసిన పుణ్యభూమి
చూడు మనదనాదిది కదా చుట్టరికము
వదలబోకుము నా చేయి వాసుదేవ 74

మొదలు పెట్టినదేదైన ముగియవలయు
యుద్ధమో జన్మలొందుటో సిద్ధమిదియె
నిలుప సంసారచక్రమ్ము నీవెయంటి
వదలబోకుము నా చేయి వాసుదేవ 75



సౌమ్య! సర్వసమర్థులున్ సాగిలపడి
వేడిరెందరో శరణము వివరమేల
యేమి తెలియని నేనెంత స్వామియంటి
వదలబోకుము నా చేయి వాసుదేవ 76

కూడని పనుల చేసిన కూళనడచి
కాచి గర్భస్థ శిశువును వేచి నిలుచు
నిన్ను కాక వేరెవరిని సన్నుతింతు
వదలబోకుము నా చేయి వాసుదేవ 77

వ్రాయ నేను నారాయణ భట్టతిరిని
కాను లీలలు తెలిసిన ఘనుడ కాను
కాని నీ చేయి పట్టిన కూననయ్య
వదలబోకుము నా చేయి వాసుదేవ 78

దోషయుక్తమౌ ద్రవ్యంబు తోడునుండ
విష్ణురాతుని వీడె సహిష్ణు శక్తి
తొలుత నీకిత్తు నేదైన దోషముడుగ
వదలబోకుము నా చేయి వాసుదేవ 79

శాస్త్రమెరుగ యోగాదుల స్పర్శలేదు
సాధనాదుల చేయంగ సాధ్యపడదు
చిత్తమొక్కటి నీ కాళ్ళ చెంత నిడుదు
వదలబోకుము నా చేయి వాసుదేవ 80



బరువు నెన్నక గో గోప వ్రాతమునకు
రక్షగా నిల్చు వరమిచ్చి దీక్షబూని
గిరిని వేలుపై నిలుపు నీ దరినె యుంటి
వదలబోకుము నా చేయి వాసుదేవ 81

నీదు రూపు గనిన విన్న నీదు మాట
మదిని నీ స్ఫురణ మెరియ మనసు మురియ
కనుల నీరది నిలువక కారనిమ్ము
వదలబోకుము నా చేయి వాసుదేవ 82

పదుగురుల దృష్టి పడునని భయము లేక
దృష్టి తగులక యుండెడి తీరుగలదు
ఒరులు చొరనట్టి నా గుండెనుండుమయ్య
వదలబోకుము నా చేయి వాసుదేవ 83

రూపులెన్ని దాల్చినను నీ చూపు చాలు
అసలు రూపమ్ము కన్పించునంట నీకు
నన్ను నన్నుగా చేకొమ్ము నమ్మియుంటి
వదలబోకుము నా చేయి వాసుదేవ 84

అఘ తృణ శకట బక వత్సమన్యులంత
నిన్ను దునుమంగ నెత్నించి భిన్నులైరి
శరణు వేడిన రక్షించు కరుణ నీవు
వదలబోకుము నా చేయి వాసుదేవ 85



బలము కలదని పరులను బాధపెట్ట
మడుగునందున దాగియు మడియునంచు
పట్టి కాళీయు మర్దించు పరమపురుష
వదలబోకుము నా చేయి వాసుదేవ 86

వస్త్రమపహరించుట లీల వనితల యెడ
వస్త్రమందించి ద్రౌపది భయము బాపె
హరణ దానములవి నీదు కరుణయందు
వదలబోకుము నా చేయి వాసుదేవ 87

ఆర్తి నంగీకరించెద వహముకాదు
నీదు లీలలందున దీని నిగ్గు తేలె
సర్వ మర్పణమంటిని సత్యమయ్య
వదలబోకుము నా చేయి వాసుదేవ 88

వెన్న నీకేల యిష్టమో వెదుక తెలిసె
జరుప సంస్కార బాహుళ్య సాధ్యమౌట
నేను తపియింతు పొందంగ నీదు ప్రేమ
వదలబోకుము నా చేయి వాసుదేవ 89

ఖ్యాత పూజార్హుడెదురైన ఘనుడననక
యెదుటికేగి యర్చింతువే యొదిగియుండి
మాకు బోధయౌ బాటయౌ మద్గురువర
వదలబోకుము నా చేయి వాసుదేవ 90



త్రిగుణ సంచార సంక్షోభ తీవ్రఫలము
నిన్ను మదినెంచు చిత్తమ్ము సున్నయాయె
పరుసవేదివై నను తాకి పైకి గొనగ
వదలబోకుము నా చేయి వాసుదేవ 91

మంచి మాటలు శ్రద్ధగా మనసు నింపు
శ్రవణ భక్తి సత్ఫలమైన శాంతి నొందు
మార్గదర్శనమందించు మాన్యవరుడ
వదలబోకుము నా చేయి వాసుదేవ 92

తెలివిగలవాడ నన్నట్టి తెగులు బాసి
నీదు ఘనకీర్తి స్తుతియించు నియమమదియె
కీర్తనమ్మట నేర్పవే కేలుబట్టి
వదలబోకుము నా చేయి వాసుదేవ 93

కండ్ల కనిపించు సర్వమ్ము కాదు వేరు
అంత నీ రూప వైచిత్రి యనుట స్మరణ
నేను త్రికరణ సాక్షిగా నేర్చుకొనగ
వదలబోకుము నా చేయి వాసుదేవ 94

గురుని పాదసేవనమున తెరువు తెలిసి
నిన్ను భక్తిగ నర్చించి నిష్ఠతోడ
ధన్యునౌటకు చేసెద దాస్యభక్తి
వదలబోకుము నా చేయి వాసుదేవ 95



శిరసు వంచి యహము లేక సిగ్గు విడచి
వంగి శరణంచు నేజేతు వందనమ్ము
కొనుము కాదన వలదయ్య కొనుము తండ్రి
వదలబోకుము నా చేయి వాసుదేవ 96

ఏక వస్తువు తోచుననేకమట్లు
తల్లిదండ్రి బంధుజనలు తరుజలమటు
వారితోడుత సఖ్యమ్ము చేరు నీకు
వదలబోకుము నా చేయి వాసుదేవ 97

ఘట సమస్తమౌ నేక మాకాశమట్లు
నేను నేనన నేననా కాను కాను
నీ యభిన్నమౌ యాత్మయె నేనుగాగ
వదలబోకుము నా చేయి వాసుదేవ 98

కొంగు పసిడివి కవచమ్ము గురువు నీవు
మారు మాటేల? యేదేని మాకు నీవె
నీవు దక్క వేరొండు నేనెరుగనయ్య
వదలబోకుము నా చేయి వాసుదేవ 99

విశ్వరూపుడ వీవన్న విషయమెఱిగి
పూర్ణమందున భాగమౌ పూర్ణమన్న
యెఱుక నిలిచియుండగ నాకునెల్లపుడును
వదలబోకుము నా చేయి వాసుదేవ 100



## సమర్పణ పద్యాలు

కవులు పెక్కురు వ్రాసెడి కవనమరసి
కల్గె పద్యరచన పైన కాంక్ష నాకు
శక్తి యుందని కాదు నీ రక్తి తప్ప
వదలబోకుము నా చేయి వాసుదేవ 101

శతకరచనకు పూనుట సాహసమ్మె
భావుకతలేదు నా వద్ద భాష లేదు
దిక్కు లేనట్టి వారికి దిక్కు నీవె
వదలబోకుము నా చేయి వాసుదేవ 102

గణములన్నింటి సర్దితి గమనమెంచి
గుణములెరుగను దోషాల గుర్తులెఱుగ
క్షణము వీడక తలచు నీ గణమువాడ
వదలబోకుము నా చేయి వాసుదేవ 103

చేతకానితనము నాదు చేవకాగ
చేదుకొనెడు లక్షణమది నీదు ఘనత
చాలు మన బంధమునకిది చాలునయ్య
వదలబోకుము నా చేయి వాసుదేవ 104

వంద భావాల నొకచోట వరుసగాను
పోయలేనట్టి నను చూసి పొమ్మనకుము
శక్తిహీనులకమితమౌ శక్తివీవె
వదలబోకుము నా చేయి వాసుదేవ 105



పద్యమెట్లున్నదను చింత పాడి కాదు
వదలబోకుము వేడితి వందసార్లు
వందయన్న ననంతశబ్దమట తండ్రి
వదలబోకుము నా చేయి వాసుదేవ 106

పద్యపుష్పాల నొకవంద వరుసగాను
పేర్చి నీపాద పద్మాల కూర్చినాడ
వంకరల పాటి చేయక వంకలిడక
వదలబోకుము నా చేయి వాసుదేవ 107

తోచినంతగ భావాల దూసి దూసి
వ్రాసినాడను వానిని రాశి పోసి
మంచిచెడుగుల మన్నించి మనసు చూసి
వదలబోకుము నా చేయి వాసుదేవ 108



వసుదేవ సుతం దేవం
కంసచాణూర మర్దనమ్
దేవకీ పరమానందం
కృష్ణం వందే జగద్గురుమ్



శతకరచన నా దృష్టిలో ఒక తపస్సు.
ఏ భావము వ్రాయాలి, నిర్ణయించుకున్న
ఛందస్సులో ఇముడుతుందా లేదా,
ఎత్తుగడ ఎలా ఉండాలి, స్వామి గూర్చి
నేను భావప్రకటన నిర్దుష్టముగా
చేస్తున్నానా లేదా... ఇలా అనేక
ఆలోచనలు మనసులో తిరుతుంటాయి
శతకం పూర్తి అయ్యేవరకు.
అంటే రచనాకాలమంతా
మానసిక తపస్సు చేసినట్లే అని
నా మనసుకి అనిపిస్తుంది.
అనిపించడం కాదు అనుభవం కూడా.

అందుకే కృష్ణుని మీద అనేక శతకాలున్నా
నా కృష్ణుడు నాకు స్వంతం. నా ప్రార్థన
"వదలబోకుము నా చేయి వాసుదేవ"